సీ. రాజమార్గంబు వారణఘటాఘోటక
శకటికాభటకోటిసంకులంబు
ధరణీస్థలీరజస్త్రిసరేణుబహుళంబు
గావున మన మందుఁ బోవవలదు
క్రంతత్రోవల నొండుగలకలంబులు లేవు
తలఁచుగా సుఖవినోదములు గలవు
మఱియు విశేషించి మన్మథకూటమా
వేశవాటిక మధ్యవీథిఁ దఱిసి
చిత్తమున కెక్కినట్టి లంజియలతోడ
సరససల్లాపసౌఖ్యంబు సలుపవచ్చు
నంత మధ్యాహ్నసమయమా నపుడుగాని
వేడుకై యుండ దక్కలవాడ సొరఁగ.

గీ. అనినఁ డిట్టిభుఁ డౌనంచు ననుచరింప
నాలువరిక్రిందిత్రోవగా నరిగి యరిగి
విప్రుఁ డీక్షించెఁ బలినాటివీరపురుష
పరమదైవతశివలింగభవననాటి.

పల్నాటివీరులకథ

మ. ద్రుతతాళంబున వీరగుంభితకథుం
ధుంధుంకిటాత్కారసం

గతి వాయింపుచు నాంతరాళికయతి
ప్రాసాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీ
రానీకముం బాడె నో
క్కత ప్రత్యక్షరముం గుమారకులు ఫీ
ట్కారంబునం దూలఁగన్.

సీ. గర్జించి యరసి జంఘాకాండయుగళంబు
వీరసంబెటకోల వ్రేయు నొకఁడు
ఆలీఢపాదవిన్యాస మొప్పఁగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొనునొకండు
బిగువుఁ గన్నుల నుబ్బుబెదరుఁజూపులతోడ
ఫీట్కార మొనరించుఁ బెలుచనొకఁడు
పటుభుజావష్టంభపరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటునొకఁడు
ఉద్దిప్రకటింప నొక్కరుం డోలవాఁడు
బయలు గుఱ్ఱంబు భంజళ్లఁ బఱపు నొకఁడు
కొడుము దాటింపుచును బెద్దగోలువులోనఁ
బడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు.

గీ. కులముదైవతంబు గురిజాలగంగాంబ,
కలనిపోతులయ్య చెలిమికాఁడు,

పిఱికికిఁ గండ లేని యఱువది మేఁ గురు
పల్లెనాటివీర బాంధవులకు.

గీ. ఆరువల్లినాయి * నారిదుర్మంత్రంబు
కోడిపోరు, చాపకూటికుడుపు,
ప్రథమకారణములు పల్నాటియేకాఁగ
వీరపురుషసంప్రహారమునకు.

ఉ. పచ్చనిపిండిగందమును,
బాలముసేసయు, నెట్టపూవులన్
గ్రుచ్చినకంఠమాల్యములు,
గొప్పఁగనల్లినవేణిబంధముల్,
కుచ్చులవీరసంబెటయుఁ,
గ్రొత్తమణుంగుకాసెపుట్టముల్,
అచ్చలకెక్కినట్టి రవ
ణంబులు వీరకుమారకోటికిన్.

క. నల్లంగొండయు, నాగరి
కల్లును, ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పల్లేరు నాగులేరును,
బల్లెత్మాకాంత యెల్లప్రారంభంబుల్.

---

* యురాలి అని యుండవచ్చును.

సీ. ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై
సామంతనృపతులు చాపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు
నళినాక్షి యార్వెల్లినాయురాలు
నిజ మనుశుద్ధికై నిప్పులయేటిలో
నోలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోటఁ బోరిరి యిలపణంబుగ నొల్ల
సవతితల్లులబిడ్డ లవనిపతులు
ధీరులగువార లేవురు వీరపురుషు
లై మనోద్ధతి నిచ్చోట నాజిఁబడిరి
యనుచుఁ జెప్పుదు రైతిహ్య మచటనచట
జనపపెద్దలు పల్లెదేశములయందు.

ఉ. చిత్తముగూర్చి మాచెరల
చెన్నుఁడు శ్రీగిరిలింగముం గృపా
యత్తతఁజూడ *ముల్కివిష
యంబున కామహిమంబు చెల్లెఁగా
కుత్తరలోన మింట జల
ముట్టినమాత్రన నాపటాలలో

* 'బల్లె' అని యుండునేమో?

విత్తినయూవనాళ మభి
వృద్ధి ఫలించుటయెట్లు చెప్పుమా?

మ. మగసింగంబులు సంగరాంగణములన్
మత్తిల్లి రున్మత్తులై
జగదేకస్తుతు లంచు నేమిటికి సం
శ్లాఘింప! నాభూమిలోఁ
జిగురుంబోఁడులఁ గాఁపుగుబ్బెతల న
క్షీణప్రభావంబునన్
మగసింగంబులఁగా నెఱుంగుదురు పుం
భావప్రసంగంబులన్.

గీ. కోలదాపునఁ ద్రిక్కటిఁ గూడియున్న
గచ్చుసేసినచిత్రంపుగద్దెపలక
వ్రాసినా రదె చూడరా వైశ్యరాజ!
శీల బ్రహ్మాదివీరనాసీరచరిత!

వ. ఈ వీరపురుషులు మనకుం గార్యసిద్ధిసేయుదురు గాక పదపద మనుచుం గతిపయపదంబు లరిగి నింబపల్లవ నికురుంబ సందానిత వందనమాలికాలంకృత ద్వారం బగు నేకవీరాగార గోష్ఠంబు గనుంగొని.

ఏకవీర

సీ. వందనం బిందిరావరు కన్నతల్లికి,
దండంబు ఫణిరాజమండనకును,
నంజలి సోమసూర్యానలనేత్రకు,
నభివందనము జగదంబికకును,
మొగుపుఁజేతులు దేవమునిసిద్ధసేవ్యకు,
జమదగ్ని గారాపుసతికి శరణు,
జోహారు రమణీయశోభనాకారకు,
నమితంబు గిరిరాజనందనకును,
నిత్యకల్యాణి, కలికులనీలవేణి,
కాదిశక్తికి, వేదవేదాంతసార,
కేకవీరకుఁ, బూర్ణరాకేందుముఖికి,
నఖిలజననికి, సాష్టాంగ మనుదినంబు.

సీ. పద్మలోచన భృగుబ్రహ్మసంయమివంశ
పరిపాటి కభినవాభరణ మయ్యె
రమణి త్రేతాద్వాపరములసంధ్యావేళ
మగనితోఁ బెక్కేండ్లు మనువు మనియె
నెలఁత కానకకన్న నెయ్యంపుఁగొడుకుచేఁ
జంపించె ముయ్యేడుసారె నరుల
తరుణి హైహయరాజదంతాస్థిపటలంబు
గవడపేరుగఁ జేసి కట్టెనబుత

మండపాకను, పెనుఁబాక, మాహురమున,
నాగవరమున, పోలాస, నని చె నింతి
యోరుఁగంట వసించె నీలోత్పలాక్షి
కాకతమ్మకు సైదోడ యేకవీర.

సీ. అలిగి యెంతటిరాజు నాండ్ర నైనను బట్టి
పుట్టుఁబాపలఁ జేయురట్టుకత్తె
ఘనుఁడైన జమదగ్నిమునినాథుకూరిమి
వెలయించుపెనుఁబాక వేడ్కకత్తె
సుక్షత్రియకులంబు నిక్షత్రముగఁ జేయు
కొడుకుఁ గాంచినయట్టి కోపకత్తె
బవనీలజవనికపాటల నిల్లాండ్ర
రమణఁ ద్రుళ్లాడించు రంతుకత్తె
యోలిమి గదుళ్లవాఁగులో నోలలాడు
కలికిపల్లికదేబెలఁ గన్నతల్లి
వాసికెక్కినయట్టిపోలాసయిల్లు
చక్కమెప్పులమాహుర మ్మక్కనాచి.

బవనీఁడు

సీ. కక్షనిక్షిప్తవికస్వరస్వరవిలా
సశ్రీనివాసంబు జవని కందుఁ

గట్టినతంత్రికిఁ గంఠశ్రుతికిఁ గూడఁ
జొక్కంబుగా నారి సొబగు మీఱ
నాలాపములశుద్ధసాళవ సంకీర్ణ
వివిధరాగంబులచవులుచూపి
డమడమధ్వనులఁ బోటూరించి యెడనెడఁ
గర్తరమార్గంబు బిత్తరిల్ల
వాద్యవైఖరిఁ గడునెఱవాది యనగ
నేకవీరామహాదేవియెదుట నిల్చి
పరశురామునికథ లెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ
జారుతరకీర్తి బవనీలచక్రవర్తి.

మా లె త

మ. అలరుంబోఁడి జనంగమప్రమద మ
ద్ధ్యానద్ధఘంటాధ్వనుల్
చెలఁగంబాడె సమస్తలోకజననిన్
శ్రీయేకవీరాంబికన్
వలరా జొక్కకమూర్ఛనాస్వరమునన్
బ్రాణంబు గల్పింపఁగాఁ
గలకంఠీకలకంఠకోమలకుహూ
కారంబు తోరంబుగన్.

మ. అకలంకస్థితిఁ గోరి కొల్చెదరు బ్ర
హ్మానందభావంబునన్

సకలానందమయైకమాత యగుచుᴇ
సంతోషచిత్తంబునᴇ
తకదుందుమ్ములు తాళముల్ జవనికల్
తందాన లమ్మయ్యకుᴇ
ఏకవీరమ్మకు మాహురమ్మకును బో
హ్రీంకారమధ్యాత్మకుᴇ.

శా. ఆలోకింపక మ్రొక్కరాదు నిజభ
క్త్యావేశసంపత్తిమై;
నాలోకించినఁ జిత్త మెట్లగునో కా
మావేశసంయుక్తిమై;
నేలా గోయి కిరాట! మానుదమొ; సం
వీక్షింతమో; చెప్పుమా!
వ్రీళాశూన్యకటీరమండలము దే
వీ శంభళీవ్రాతముᴇ

కాఁ పుట్టాలు

సీ. చటివోని గడితంపుఁ జిఱుతచౌకంబుల
తొగరుఁబుట్టము కచ్చఁదోడివి కట్టి
యొాలగందపుబొట్టు నుపరిభాగంబుపై
సిందూరతిలకంబుఁ బొందుపఱచి

పసరుదారెడునింబపల్లవంబులదండ
గుబ్బచన్నులమీఁదఁ గుదురుకొల్పి
క్రొత్తదోమినదంతకోరకంబులయందుఁ
దాంబూలరాగంబుతళుకుగూర్చి
సకలసంధ్యంగములకుఁ దేజంబు గలుగ,
మధుమదారంభ మఱఁకువ మరలఁద్రోవఁ,
దేఁకువయు నారజంబునుఁ దేటపడఁగఁ
బురమునకు వచ్చె, నొకకాఁపుఁబూవుబోఁడి.

వ. అయ్యవసరంబున నేకవీరాంబకుం బ్రణమిల్లి
యట చనునప్పుడు.

జక్కులపురంధ్రి

సీ. కోణాగ్రసంఘర్షఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను
కొడుపుచేఁ దాటించు నెడపదడప
శ్రుతికి నుత్కర్షంబుః జూపంగవలయుచోఁ
జెవిత్రాడు బిగియించుజీవగట్టు
గిల్కుగిల్కునమ్రోయు కింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప

రాగముననుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీమహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె జక్కులపురంధ్రి.

అక్కలు

సీ. ముద్రికామాణిక్యములదీప్తి కెంగేలి
పించెంబుఁగుంచెతో బిత్తరింప
నుపవాసమునఁ దగ్గియును సన్ననగు కౌను
చనుదోయిభరమున జలదరింపఁ
దోకచుక్కలఁబోలు తోరంపుఁదెలికన్ను
బ్రాఁసశాలా లానైళమున సిగ్గు నతకరింపఁ
నిద్దంపువెలిపట్టునెఱిక దూలినయప్డు
తొడలమించులు వెలిఁ దొంగలింప
నురుమచప్పళ్లకును బిల్లదురులమ్రోఁత
కంతకంతకుఁ బేరుబ్బు నావహింప
నాడెఁ బీఁటలపై నోలిఁ గూడియున్న
యక్కలేడ్వురలో నొక్కయలరుబోఁడి.

చ. హరహర యింత యొప్పనె మ
హారభటిక్ జగఝంకృతస్వన

న్మురళీవిమిశ్రితాంకరవ
మూర్ఛలఁ జిత్తము లుబ్బి యక్కలే
ద్యోరు నదె యాడఁజొచ్చిరి క
దుం గడు వేడ్కసమున్నమత్సయో
ధరయుగభారభీరుతమ
తన్వవలగ్నము లైన నృత్యముల్.

వ. ఇదె యీయింటి యజమానుండు సంతానకాం
క్షియై ప్రతిబంధ నోదనార్థంబు యక్షకన్యలం
బరితోషారాధనంబు సేయుచున్నవాఁడు గావలయు
మాణిభద్రకులోద్వాహులైన దేవతలు కామవల్లి
శ్రీమహాలక్ష్మితోఁగూడి యపేక్షితకార్యంబు మ
నకు నవ్యాక్షేపంబునం జేయుదురుగాక యనుచు
విశ్వాసంబుతో నమస్కారంబు సేసి కాసల్నాటి
గోవిందమంచనశర్మ నర్మసఖుండు దాను నటచని
ముందట.

గీ. మంద్రమధ్యతార మానత్రయాభిన్న
మహిషశృంగనాద లహరిఁ గూడి
డమరు డిండిమంబు డమడమధ్వని మ్రోసె
నద్భుతం బదేమి యార్భటంబు.

మైలారభటులు

వ. అని టిట్టిభుం డడిగిన;

సీ. ఉవఉవ మందు నెట్టనిచంద్రమల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాఁడియలుఁగుల గనపపాఁతర్లలో
నుట్టిచేరులు గోసి యుఱుకు వారు
గాలంపుఁగొంకిఁ గంకాళచర్మము గ్రుచ్చి
యుండువీథి నుయ్యేల లూఁగువారు
కటి కయోనాళంబు గండగత్తెరవట్టి
మిసిమింతులును గాక ద్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు
యెడమకుడిచేత నారతు లిచ్చు వారు
సాహసముమూర్తి గైకొన్నసరణివారు
ధీరహృదయులు మైలారవీరభటులు.

గీ. వీరు మైలారదేవర వీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టికసీలంతగాని లేదు.

చ. వెనుకకు మొగ్గవ్రాలి కడు
విన్నను వొప్పఁగఁ దొట్టినీళ్ళలో

మునింగి తదంతరస్థమగు
ముంగర ముక్కున గ్రుచ్చికొంచు తే
చెను రసనాగ్రవాళమున
శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమలీల నిప్పుడు చు
పాయము లిట్టివి యెట్టు నేర్చెనో?

సీ. శనివారసిద్ధి సజ్జనపారిజాతంబు
వరదాత యాదిత్యవారభోగి
మాడచీరమణుంగు మాయావినోదుండు
మాళవీప్రియభర్త మహితయశుండు
పల్లెమ్మనాయకుం డెల్లవేల్పులరాజు
గనపవేటలవేడ్క కాంద్రభర్త
క్షేత్రశాలస్వామి కరుణాపయోరాశి
పుణ్యకీర్తనుం డైనప్రోలియయ్య
మంచు కుంచాలం గొలువంగ మాయలెల్లం
బట్టికట్టంగ నేర్చినబాసవెల్లి
భైరవునితోడిజోడు మైలారదేవుం
డోరుంగంటినివాసి మే లొసంగుంగాత.

మ. అదిగో! యెత్తినవారు పట్టణము మ
ధ్యశ్రోణి సింహధ్వజం

బదిగో! కట్టినవారు నింబదళమా
ల్యాంతోరణ వ్రాతముల్
విదితం బయ్యె మహోత్సవంబు నెఱయన్
వీక్షీవిటంకంబులం
దదిగో! నిల్పినవారు పూర్ణకలశం
బాబాలవృద్ధాంగనల్.

మ. అకలంకస్థితి శీధుపానరుచులై
యాసాను లుప్పొంగి యో
యకరో యమ్మకరో యమక్కరో యదీ
యట్టట్టకో యంచుఁ బా
యక తప్పెట్లునుఁ దల్లెతాళములు నిం
పైసొంపు రంజిల్లఁగాఁ
జకజుంజుం జకజుంజు జుమ్ము మనుచున్
సాగుం గదున్ వాద్యముల్.

వ. అటచని ముందట.

నగరావలోకనము

సీ. అదె, భైరవస్థాన మటమీఁద నల్లదె,
చముడేశ్వరీమహాశక్తినగరు
వీరభద్రేశ్వరాగారమంటప మదె,
యదె, బౌద్ధదేవువిహారభూమి

అదె, ముద్దరా ల్మ్రసానమ్మ్రనివాసంబు
నల్లదె, కొమరుసామయ్య నగరు
అదె, పాండవులగుడి యటదక్షిణంబునఁ
గర్తారుఁ డుండు తుర్కలమసీదు
కొంతదవ్వుల నదె, మహాగోపురముల
పైఁడికుండలు రవిదీప్తిఁ బ్రజ్వలించి
కానవచ్చెను మేరుశృంగములఁబోలెఁ
గేశవశ్రీస్వయంభూ నికేతనములు.

వ. అనుచు నట చని ముందట నొక్క భైరవాల
యంబుఁ బొడగని నమస్కరించి కాసల్నాటి
మంచనశర్మ యిట్లనియె.

భైరవుఁడు

మ. అమితోత్సాహములోడ నీవు పటుబా
హాథక్కనొక్కొక్క మా
టు మనఃకంపము నొంచఁ జేయఁ దొలఁకా
దుర్గ వార్ధి వేల్లాలుర
త్కమఠంబై, వలమానమీనము, యు
ద్యన్నక్రమై, యుత్తర
త్తిమివై, యుల్లలదంబుమగ్నధులివై,
ధీరా మహాభైరవా!.

వ. అనియూర్ధ్వం బవలోకించి యిప్పుడు మధ్యా
హ్నకాలం బగుచున్నయది.

మధ్యాహ్నము

శా. ప్రాలేయ దిక్కుల భానుభావ్యతికర
ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాలజాంగలతటీ
వాచాలకోయష్టులై
రోలంబంబులు మూతిముట్ట వెఱచెన్
గ్రావ్వేఁడి బీరెండలన్
జాలంగ్రాఁగి కరంబు వేఁడి యగు కా
సారాబ్జమైరేయముల్.

వ. అనియనంతరం బాకాశంబునం జెవివెట్టి శ్రుతినభి
నయించి గోవిందుండు.

గడియారము

మ. ఉడువీథిన్ శిఖరావలంబియగు నం
ధ్రోర్వీశుమోసాలపై
గడియారంబున, మ్రోసె రెండెనిముదుల్
ఘంటాఘణాత్కారముల్
సడలెన్ భానుఁడు పశ్చిమంబునకు వై
శ్యా! పూటకూటింటికిన్

గుడువంబోదమె లెక్కయిచ్చి?కడు నాఁ
కొన్నార మిప్పట్టునన్.

వ. విచారించిన నదియును మనకు విశ్రమస్థానంబు.

పూటకూటియిల్లు

గీ. సంధివిగ్రహయానాదిసంఘటనల
బంధకీజారులకు రాయబారి యగుచు
పట్టణంబున నిత్యంబు పగలు రేయి
పూఁటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు.

వ. అనుచుఁ గొంత దవ్వరిగినం దమకు నెదురుగా నేతెంచు నొక్క బ్రాహ్మణుం గనుంగొని.

ఉ. వీఁడిదె తెల్లనాకులను
వీడెముసేయుచు వీధి వచ్చుచు
న్నాఁడు మదించి తిండి తిని
నాఁడు చుమీ యిటమీఁద నేడకో
తేఁడఁగఁబోయెడిం గరణ
దేశప్రజాణఁడుగాఁగఁబోలు నీ
బాఁడు; పణోపహారపరి
పాటియెఱుంగగవచ్చు వీనిచేఁ.

వ. ఇఁతడు వెడలివచ్చునవ్వాడయె పూఁటవంటకంబువెట్టు బాడబులవాడ గావలయు నది యెట్లంటేని.

ఉ. ఘ్రాణపుటీకుటీరములఁ
గాపుర ముండఁదొడంగె నిష్పే పా
షాణఘరట్టఘట్టనవ
శంబునఁ బుట్టిన సత్తుగంధము
క్షీణకఠోరసౌరభవి
జృంభణదిక్కులఁ జల్లఁజొచ్చె సా
మ్రాణిపదార్థజాలములు
బ్రాహ్మణకాంతలు తాలఁ బోయఁగన్.

గీ. మాఁక వేగంబుతోఁ గ్రొత్తమలఁకవాళ్ల
కిఱ్ఱుచెప్పులు మొరయ నంకించి నడుచు
కరణ బ్రాహ్మణవిటముఖ్యుఁ గదియవచ్చి
పూతిమాషాన్వయుండగు భూసురుండు.

వ. పూఁటవంటకంబుల వృత్తాంతం బడిగిన నతండు.

క. ఆహారవిహారములకొ
యాహారంబునకునో విహారంబునకో
బేహారము మీకీసం
దేహారంభంబు మాకుఁ దెలియఁగ వలయున్.

వ. ఆహారంబున కంటేని.

ఉ. కప్పురభోగివంటకము
కమ్మనిగోధుమపిండివంటయున్

గుప్పెడుపంచదారయును
 గ్రొత్తగఁగాఁచిన యాలనేఁ పెస
ర్పప్పును గొమ్మునల్లనఁటి
 పండ్లును నాలుగు నైదు నంజులున్
లప్పలతోడఁ గ్రొంబెరుగు
 లక్ష్మణవజ్ఝలయింట రూకకున్.

వ. విహారంబున కంటేని దద్గృహంబున.

క. అఱుగాను గుబ్బచన్నులు
మెఱుగుంగన్నులును గలుగు మెచ్చుల నవలా
కఱుబోడ ముండరత్నముఁ
బ్రహ్మోవఁగ విడిచినట్టి బ్రహ్మకు జేజే.

శా. పూవుంబోఁడులు లేరె విప్రవిధవల్
 భూమండలిన్ దానిరే
ఖా నైదగ్ధ్యవిలాసవిభ్రమకళా
 గర్వంబు లట్లుండనీ
యావిశ్వస్త యుపస్థచాయ నవల
 త్యాశీశ్వరఫాలస్థలీ
సౌవర్ణస్థిరపట్టబంధసుషమా
 సౌభాగ్యలక్ష్మిన్ గనన్.

ఉ. కోయిల పంచమస్వరము
 క్రోల్చినభంగిని విద్దికూచి రా

మాయణ మాఱుకాండములు
నచ్యుతజాగర వేళఁ బాడె నా
రాయవిఠంతురత్న మను
రాగముతోడ "నమశ్శివాయ శాం
తాయ సమస్తదోషహర
ణాయ" సమానమె దాని కెవ్వరుల్?.

ఉ. సంకృతిపూతిమాపకుల
సాగర శారదపూర్ణిమాకురం
గాంకుఁడు మంచి లక్ష్మణుగృ
హంబున నెచ్చెలికాఁడుఁ దానునుం
జంకలబంటిగా మెసవి
చక్కని వేడుకకత్తెఁ జూచి తా
రింకొకమారు వత్తమని
యేఁగిరి కార్యభరంబు పెంపునన్.

వ. అటఁబోవంబోవ ముందట.

గేదఁగిపూవు

సీ. పాంథసీమంతినీ ప్రాణమత్స్యములకు
గాలాములగు కంటకముల తోడ
గరుడపచ్చలచాయఁ బరిహసింపఁగఁజాలు
దళమైన బాహ్యపత్రముల తోడ

జీర్ణకీకసకణశ్రేణిఁ జిడ్డులుచేసి
యవియఁదోఁమినయట్టియన్నులతోడఁ
బదియూఱువన్నియ బంగారు సరివచ్చు
సంవర్తికాపలాశములతోడ
శివునిచిచ్చుఱకంట వెచ్చిన యనంగు
బూది కెనయైనకమ్మఁబుప్పొళ్ల తోడ
దావిఘనమైన కమ్మగేదంగిపూవు
భూసురునకిచ్చెఁ డగ నొక్కపుష్పలావి.

వ. ఇచ్చినం జూచి.

ఉ. క్రొన్నెలరేఖతోడఁ గడఁ
గూడి సుఖింపఁగ భాగ్యమబ్బమిన్
ఖిన్నతనొందుఁగాని నవ
కేతకి శూలి వివేకహీనుఁడై
తన్నుఁ దిరస్కరించుటకు
దైన్యమునొంద దచే వివేకసం
పన్నిధి దానిపాలి పెరు
మాళ్ళొకఁ డెక్కడనైన లేఁడొకో?

గీ. అందుకొని పుష్పలావికిఁ ద్యాగమిచ్చి
బ్రాహ్మణుల కందు నొక్కొక్కపత్ర మొసఁగి
జాణవిప్రుండు సిగఁదాల్చెఁ జందమామ
కొండనాలికయగు నొక్కగోమలిఱేకు.

* * *

* ఇట గ్రంథపాతమేమో?

వ. అదె విద్వేషిభువన జిగీషాసంరంభ విజృంభమాణ ఝుషధ్వజ భుజపరాక్రమ సముత్సాహ నాటక ప్రస్తావనా ప్రథమనాందీశ్లోకంబగు వేశ వాటికానికటంబు.

గీ. చందనంబున గలయంపి చల్లినారు
ముగ్గులిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినా రిందురజమున రంగవల్లి
కంజములఁ దోరణంబులగట్టినారు.

వ. ఇదియెవ్వరియిల్లొకో! శోభనంబు ముడివడుచున్న యది యనుచు నాకాశంబువీక్షించి యచ్చటి వారల నేమి యని యడిగిన.

మాచల్దేవి

శా. ద్వీపాంతంబుననుండివచ్చితివె? భూ
దేవా! ''ప్రశాంతం మహా
పాపం'' సర్వజగత్ప్రసిద్ధసుమనో
బాణాసనామ్నాయవి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీ
శోపాత్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ తెఱుంగవయ్యెదవె మా
చల్దేవివారాంగనన్.

వ. చిత్రశాలాప్రవేశంబు చేయుచున్న యది పుణ్యాహవాచనకాలంబు మీరునుఁ బచ్చని పిల్లికూటంబుఁ జూడవచ్చునది యనిన,

గీ. తెన్నగాక కిరాట! యీ లేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీనిఁ జూడంగఁ బోదమా యీ నెపమున
నరసి చూతము మన కేమి యచట? ననుచు.

వ. అనుచుఁ బ్రవేశనాటితకంబునఁ జిత్రశాలఁజొచ్చి పూతిమాషగోత్రుం డచ్చోటం బిల్లికూటంబున నిలువుసం జ్ఞైసేసి హంసతూలికాతల్పంబుమీఁదం గూర్చున్న హావభావ విభ్రమవిలాసనిధి మాచల్దేవిఁ గనుంగొని.

గీ. అంకుశాఘాత రేఖల నంద మొందు
గంధగజకుంభములతోడఁ గలహమాడు
క్రొత్తనఖములతోడి నీ కుచభరమున
కతివ యభ్యుదయపరంపరాభివృద్ధి.

గీ. కల్లఁజెప్పము విను నీకుఁ గల్గప్రసిద్ధి
ఢిల్లిసురతాణికిని లేదు పల్లవోష్ఠి
యాదిలక్ష్మికి నీకును భేద మేమి
యుదధి జనియింపకుండుట యొకటి దక్క.

గీ. ఓరుగంటిమాచాంబ పయోరుహాక్షి
పంచబాణావతారుని మంచిఁ జూచి
కంకణాలంక్రియాఝుణాత్కార మెసఁగ
''నయ్యగారికి జోహారు'' లనుచు మ్రొక్కె.

గీ. అగురుధూపాధివాసితాభ్యంతరంబు
మగువ నీమన్మథచ్ఛత్రమంటపంబు
సర్వయోషిదసామాన్యసౌష్ఠవంబు
కాచుఁగావుత మోర్గంటికటకవిటుల.

వ. అనుటయు.

సీ. ఎందుండి వచ్చితి రీరు? కాసల్నాట
నుండి వచ్చితిమి మే ముత్పలాక్షి,
యెవ్వరివారు మీ? రేము సంకృతి పూతి
మాషమాధవునికుమారవరుఁడ
మీదివ్యనామకం బేదియో? గోవింద
మంచనశర్మసమాహ్వయులము
మీర లిచ్చటికిరాఁ గారణం బెయ్యది?
చేరి మీబోంట్ల నాశీర్వదింప
నైనవిచ్చేసి కూర్చుండ నవధరింపు
వార్చి వచ్చెద మటువోయి వనరుహాక్షి
యెచ్చటికి వార్వఁబోయెద రెఱుఁగఁజెప్పఁ?
డక్కవాడకు మేము బ్రాహ్మణుల మగుట.

వ. చిత్రావలోకనంబు చేసి టిట్టిభునకు గోవింద
మంచనశర్మ యిట్లనియె.

చి త్ర శా ల

సీ. అదె దారువనభూమి, యసమనేత్రుఁడు వాఁడె,
సంయమీంద్రులపుణ్యసతులువారె,
యదె కన్యకారత్న, మబ్జాసనుఁడు వాఁడె,
యదె రతిక్రీడావిహారశయ్య,
వాఁడె వైకుంఠుండు, వారె గోపస్త్రీలు,
యమునానదీసైకతాంత మదియె
అదె యహల్యాదేవి, యమరాధిపుఁడు వాఁడె,
యదె పర్ణశాలికాభ్యంతరంబు
చందురుఁడు వాఁడె, యదె బృహస్పతిపురంధ్రి,
జాలరియు నదె, శ్రీపరాశరుఁడు వాఁడె,
కుశికజుఁడు వాఁడె, యదె యింద్రుకొలువులేమ,
చిత్రజునిశౌర్య మెఱిఁగించెఁ జిత్రశాల.

ఉ. తియ్యనివింటిజోదు రతి
దేవిచనుంగవ నొత్తిగిల్లి యొ
య్యొయ్యన వంకచక్కఁబడ
నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్
మయ్యెరవ్రాసెఁ జిత్తరువు
మాఁగిలిమాఁగిలి; చిత్రకారుఁడా!

దయ్యముగాక; నీవిప్రస
దానము టిట్టిభ! వీనికీఁదగుర్.

వ. అనుచుఁ దద్గృహంబు నిర్గమించి పూర్వానుభూత యగు గాంధారిగృహంబు రోయువాఁడు కతి పయమందిరంబులకు నవల సిందువారలతికా కుడుంగం బడియాలంబున నెఱింగి యనుంగు మొగసాలం జొచ్చిన దాసదాసీజనంబు ససంభ్ర మంబుగా నెదురేఁగి తోడ్కొని పోవంబోయి యభ్యంతరమందిరంబున మహోత్సవవ్యాపార పారీణయైయున్న య వ్వారముఖ్యం జేరి యాస నార్ఘ్యపాద్యాది సముచితసత్కారంబులం బొంది సుఖాసీనుండై.

ఉ. గోత్రమువార లెల్లఁ గెడ
గూడినవారు వ్రతంబొ; దేవతా
యాత్రయొ; పండువో; మనగృ
హంబునశోభనమేమి? శోభనం
బత్రిసమాన!, నేటియప
రాహ్ణసమాగమవేళఁ బుష్యన
క్షత్రమునందు నీయనుఁగు
గాదిలికూఁతురు చూచు నద్దముగా

క. ఆవేళ నీవు బిడ్డకు
దీవనమంత్రంబుచెప్ప దీర్ఘాయువగున్
లావణ్యంబు వివేకము
ప్రావీణ్యము వైభవంబు భాగ్యము గలుగున్.

గీ. ముకురవీక్షావిధానంబుమొదల లేక
వెలపడంతికిఁ గారాదు విటునిఁ గవయ
యాయజూకున కెట్లు చేయంగవచ్చు
నరణిసంగ్రహ మొనరింప కధ్వరంబు.

గీ. లంజవారికి శ్రీమహాలక్ష్మిగాదె
దర్పణము విప్రముఖ్య గంధర్వగణము
పుణ్యచారిత్ర దృష్టాంతభూమిగాదె
దర్పణమ్మువివర్తవాదములకెల్ల.

ఉ. ఉన్మదమత్తకోకిలకు
హుంకలపంచమరాగరాజసం
పన్మహనీయమైనమధు
మాసపుఁబున్నమనాఁడు బిడ్డకున్
మన్మథవేదదీక్ష పది
నాళ్ళగుమాత్రము నేతదర్థమై
నన్మతినుండఁగావలయు
జక్కనివాఁడవ యక్కవాడలోన్.

సీ. అదె నీకుమారిత మదనరేఖాకన్య
వదనరేఖావైభవమునఁ జంద్రుఁ
దొరఁ గూర్చికొన్నది ధూర్తదేవత నిన్నుఁ
దంద్రిఁ బోలినయట్టి తరళనయన
సాముద్రికాగమజ్ఞానపారీణులు
కడు భాగ్యసంపదగలది యంద్రు
భాగ్యసంపదకల్మి ప్రస్ఫుటంబయ్యెఁగా
మీరలింపులవచ్చి మీఱియుంట
జనకుడవు కర్త వోజ్జవు సజ్జనుఁడవు
క్రొత్తలంజెలకాముండ వుత్తముఁడవు
తొడలనిడుకొని ముద్దుకూఁతునకు నీవు
మించుటద్దంబు చూపరా మంచిరాజ.
గీ. కేలఁ గ్రొమ్మించుటద్దంబు గీలుకొల్పి
మంచితొడమీఁద నొప్పారె మదనరేఖ
ముద్దునెమ్మోము లావణ్యమున జయించి
కువలయాప్తునిఁ జెరవెట్టుకొన్నకరణి.
క. దీవించి మంచి కూఁతురు
"శ్రీవర్ధస్వంబు" చెప్పి చెవి టిట్టిభసె
ట్టీ! వెస నిప్పింపుము సం
భావన నొకవెండి బిడ్డ పసపున కనియెన్.

వ. అనంతరంబ గాంధారి పూర్వసంబంధంబునన్నైన ప్రేమానుబంధంబునఁ గేలు గేలం గీలించి యిట్లనియె.

గీ. ఎందు పోయితి గోవింద ముందరట్ల
యెందరతివల వలపించి తెచటనెచట
తలఁపు పుట్టించెనే నీకు దైవ మిట్లు
పాయసం బారగించిన ప్రాంతపట్టు.

శ్రీకాకుళపుఁదిర్నాళ్లు

గీ. పవనపున్నమఁ గాకుళాధ్యక్షుఁడైన
తెలుఁగురాయఁడు దేవతాధీశ్వరుండు
భువనహితముగ నుత్సవం బవధరింప
నందుఁబోయితి మీపోయినట్టియేఁడు.

గీ. కారవేల్లమతల్లికాకల్పవల్లి
కడుపు నిండారఁ గాంచినకొడుకుఁగుఱ్ఱ
జారచోరమహాధూర్తచక్రవర్తి
దేవవేశ్యాభుజంగుఁడు తెలుఁగుభర్త.

గీ. పసిఁడికోర వేఁడి పాలారగించినఁ
బుల్లసిలిన యధరపల్లవమున
విప్రకన్యచనువు వెలయించుచున్నాఁడు
విశ్వమునకుఁ గాకుళేశ్వరుండు.

ఉ. ఈరసమెత్తు వేదములు
 శ్రీవహియించుఁ బురాణసంహితల్
సౌరభహీనమౌ నుపని
 షత్తులు లేఁబడు నాగమావళుల్
గారవముల్లసిల్ల సిరి
 కాకుళనాథుఁడు నాగదేవభ
ట్టారకునింటఁ బుట్టి ప్రక
 టంబుగ వేడుక నాదరింపఁగన్.

స్ర. గరుడస్తంభప్రతిష్ఠాకలన మొదలుగాఁ
 గల్పమంత్రోక్తపుష్పా
ధ్వరపర్యంతంబు కృష్ణాతటినితటమునన్
 ద్వాదశక్రోశధాత్రీ
పరివేషాభ్యంతరశ్రీ పరమపదమునం
 బర్వకాలంబునందున్
బరనారీసంగమాదుల్ భగవదనుమతిం
 బాపముల్ గాకయుండున్.

శా. వ్యామగ్రాహ్యనితంబబింబకుచహా
 రాభీలభద్రాకృతుల్
కామాంధల్ వెలనాటి కోడె విధవల్
 కాకొల్ని తిర్నాళ్లలో

*నామాంధాత్రుఁడు భీమసేనుఁడు హిడిం
బాధీశ్వరుం డో పునో
హేమోకాని తెమల్ప నేర రితరుల్
హేలారతిక్రీడలన్.

ఉ. పేర్చినసందడిం జెకలి
పిల్చి రయంబునఁ జన్నులొత్తి చే
దూర్చి యనంగ మందిరము
దూకొని కూరిమినీరు జుట్టినన్
గార్చుకొనంగఁజేసి యిటుఁ
గాఁగిట నుప్పరమెత్తి యేటికిం
దార్చి రమింతు రూళుల వి
తంతువులం దిపనాళ్ల పల్లవుల్.

క. ముంజెపదనైన శంబర
భంజను గేహములు గలుగు బ్రాహ్మణవిధవా
పుంజము లుండఁగ నూరక
లంజియ లేమిటికిఁ గాకుళయ తిరునాళ్లన్.

సీ. జవరాలఁ బొడగన్నసన్న్యాసిపై నేయుఁ
దులసి లేఁజిగురాకుఁదూపుమరుఁడు
వేదవిప్రునిఁగన్నవిధవపై ఝుళిపించు
దర్భపల్లవహేతి దర్పకుండు

---

* మాంధాళుఁడు,

కటకారకులకన్యఁ గనిన హాళికుమీఁదఁ
　　బొడుచుఁ బూమునికోలఁ బుష్పశరుఁడు
నాడింథమునిఁ గన్నతాతిపై నేయును
　　నలరుఁజిచ్చుఱకోల నంగభవుఁడు
బెరసి వెన్నెల గాయంగఁ బేరకమ్మ
పులినతలముల నాయూయి కొలము లెక్కఁగి
తాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు
నసమబాణుండు తొలునాళ్ల నన్నినాళ్ల.

వ. అని యనంతరంబ యామ్మండటం జనుదెంచు విశంతుసమూహముం గని యాశీర్వదింపవలయు నని.

విశంతువులు

సీ. చెలఁగిచెలఁగి పొత్తిచీరలు గట్టెడు
　　మానకమ్మకు దీర్ఘ మాయురస్తు
సారెసారెకు దేవసదనంబునకు నేఁగు
　　చెడిపెకు సంకల్పసిద్ధి రస్తు
నిత్యంబు వ్యభిచారనిష్ఠతో నుండెడు
　　విధవకుఁ బుత్రాభివృద్ధిరస్తు
దళముగాఁ దులసి పేరులు ధరియించినయట్టి
　　విశ్వాస్త కారోగ్య విభవమస్తు

మిండముండకు సంపత్సమృద్ధిరస్తు
పరచు తెంపికి నిత్యసౌభాగ్య మస్తు
వదరుఁబోఁడికి నీప్సితావాప్తిరస్తు
బలువితంతుకు మైథునప్రాప్తి రస్తు.

వ. అనియటచనునప్పుడు.

(ఇక్కడకొంత గ్రంథపాతమైయుండును)

వ. అనిన గాంధారి పరదేశపట్టణంబుల వితంతువుల చేత వక్షఃకుట్టనంబుసేయించుకొనమరగి నీపెట్టు మమ్ముం దలంతువు పదపద విచ్చేయు మనుచు నీర్ష్యాకుటిలంబగు కటాక్షంబునం జూచిన,

చ. లవలవఁ జన్నుదోయి గజ
లదొలుకాగు మెఱుంగుఁదీగలం
గవకవ నవ్వడాలుదెలి
కన్నులమించులు చౌకళింపఁగా
నవనవ యౌవనంబుగల
నాఁటి భవత్పురుషాయితోద్ధతుల్
శివశివ యెన్నిభంగులనుఁ
జిత్తములో మఱవంగవచ్చునే?.

వ. కార్యాంతరవ్యాసంగబున నార్యవాటికిం బోవు చున్నవాఁడ మనమదనరేఖాకమ్రావలోక

ముహూర్తంబు సుముహూర్తం బయ్యెడుఁ
బోయివచ్చెద నని.

నాగస్వరము

గీ. వెడలి పశ్చిమదిశ నాల్గుగడియ లంత
పొద్దు గలుగంగ నడువీధి బోయిపోయి
కేలిసఖుఁడును దా నాలకించి చనియె
నాగసరములమ్రోఁత యన్నాగరికుఁడు.

పాములాట

క. నాగస్వరసుషిరసర
న్నాగవరాళ్యాదివివిధనానారాగ
ప్రాగల్భ్యప్రకటఫణా
భోగములై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్.

సీ. కద్రూమహాదేవిగారాపుసంతతి
మధుకైటభారాతిమంచముగుఁబాన్పు
కాలకంఠునియంఘ్రి గండపెండారంబు
భానుమంతుని తేరి ప్రగ్రహంబు
నక్షత్రవీథి నెన్నడిమిపెద్దగ్రహంబు
మూలాలవాలంబుమొదటిదుంప
యాదిభైరవదేవు యజ్ఞోపవీతంబు
క్రీడావరాహంబు తోడిజోడు

యర్కనందనుసెలకట్టె యంపకోల
పులుఁగురాయని తాత్కాలపుణ్యభిక్ష
కేతకీపుష్పవాసనాకృత్రిమాసి
పర్వతేంద్రంబుతరిత్రాఁడు పాపఱేఁడు.

వ. ఇమ్మహానాగంబులు మనకుం గార్యసిద్ధి యొసఁ
గుంగాక యని చని ముందట.

సీ. కడగోరఁ దీర్చిన కస్తూరిగీరుబొట్టు
నెక్కసక్కెంబుగాఁ జుక్క మెఱయ
నద్దంబు ద్రికటంబునై యురస్స్థలమున
గంధసారస్థాసకములు మెఱయ
జాల నిగ్గులు గుల్కు పాలతెక్కల కుచ్చు
నామకర్ణంబుతోఁ వక్కళింపఁ
బెనచి వెంట్రుకలతోఁ బెనవెట్టి చుట్టిన
ప్రాఁతచెంద్రికవన్నె పాగయమర
జన్నిదంబుగఁ బెనుఁబాము సవదరించి
యంఘ్రికటకంబు ఘల్లుఘ ల్లనుచు మొరయ
నాహితుండికగరళవిద్యాధిరాజు
వచ్చెఁ బాములమొంగఁడు వదరులాఁడు.

సీ. ఘూత్కారపవనంబు పూరించుపుక్కిళ్ళు
ముసిఁడిపండులతోడ ముద్దుఁగురియ

సందిటిసంకుపూసలసద్దు లుతుంబి
నాదస్వరోజ్జృంభణముల నడఁప
నేఁడురంధ్రమున్నలు నిరుకేల వ్రేళ్లను
వివృతిసంవృతిలీల వి_స్తరింప
నాలాపతాళాంతరాంతరంబులయందు
వి క్క_నుశబ్దముల్ చొక్క_టముగ
నాగసింధుప్రభేదనానావరాట
రాగగంధర్వలహరికారంభణముల
మిహిపదంబుగఁ బాములమెంగఁ దూఁడె
భోగిరాజులు వ_ర్తింప నాగసరము.

వ. అటచని ముందట నొక్క_మంటపంబున విటభట పటలంబు నెదురుకట్ల నార్భటింప టిట్టిభుండు విని గోవిందశర్మ నడిగిన,

గ డిఁ డు

సీ. నున్ననై నలుపెక్కి_ నొసలిచేసువకంటి
కెకువవై చినశిఖ పెకలుచుండఁ
గరసానఁ దిగిచినకలివెగండపుబొట్టు
తిరి కట్టుకొని మోము దిరిగియుండఁ
దటపెట దిమికిట ధ్వాను లోలిఁ బుట్టింపఁ
జాలు గుమ్మెటట చంక వ్రేలుచుండ

నలుకనై మీఁజేత నంటినయాక్రొత్త
మువ్వలత్త్రైము సారె ములుగుచుండ
నోసలు స్రుక్కించు నావుర్న నోరు దెఱచు
గ్రుడ్లు మిడికించు రాగంబు గుమ్మరించు
పాడుగతులకుఁ దను దానె పరగియాడు
నల్లమాతండు వో తూప్పనాటిగడిఁదు.

మేషయుద్ధము

వ. అనుచు నటపోవఁ గంటె కిరాట! రెండు మేష
కంఠీరవంబులు నీరాటిరేవున నీరను ముంచి
నస్యంబు సేయుచుఁ బెంచుటం జేసి ధేనువుల
ననుధావనంబు సేయు వత్సంబులుంబోలె వాత్స
ల్యంబునం దన ఘోలికల వెంటఁ గంఠగ్రైవేయ
ఘంటికా టంకారంబులును విషమవిషాణకోటి
ఘటిత కపాలాయసాశ్వక్షత్ర పల్లవగుళుచ్ఛరిం
ఛోళికా ఘణాఘణాత్కారంబులు చెలంగ యుద్ధ
క్రీడాసన్నద్ధంబులై వచ్చుచున్నయవి యీసజీ
వద్యూతంబు చూతము కాక యనుచుఁ గౌతూ
హలంబున నిలిచియున్న యవసరంబున వాహ్యాళి
ప్రదేంబునం బందెగాండ్రు పందెంబు నొడిసి
తలపెట్టిన,

చ. ఉభయము భావవీథి జయ
మొందినభంగి భయం బొకింత లే
కభిముఖ మయ్యె వెన్వెనక
కై యట కొన్నిపదంబు లేఁగుచున్
రభసముతో దువాళిగొని
భ్రగ్గునఁ దాఁకెను చూడు సెట్టిటి
ట్టిభ! దిధిక్షీ యనంగను
గడిఁది యదభ్రము లీ యురభ్రముల్.

క. నిటలమ్ము లవిసి నెత్తురు
సొటసొట వడియంగ సమరశూరోత్తములై
కటుకునను మెండుతగరులు
చటులాటోపమున రెండు సరిఁబడఁ బోరెన్.

గీ. వట్టివెదురు మోపు వైచినచందాన
గుండు గుండుమీఁదఁ గూలినట్లు
కడిఁది వ్రేఁత మేషకంఠరవంబులు
తాఁకి తాఁకి తస్సి తట్టువాఱె.

వ. ఇట్లు తట్టువాటి పొట్టేళ్ళు నాస్కందం బుడిగి మం
దనిశ్వాసోచ్ఛ్వాసంబులై డిల్లపడి మూర్ఛిల్లిన,

సీ. హా హా! నృపాలసింహాసనాధిష్ఠాన
రత్నకంబళకాభిరామరోమ!

మజ్ఝా! కృపీటసంభవమహాదిక్పాల
హేలావిహారవాహ్యాళివాహ!
మాయురే! ప్రవిలంబమానాండసరపాత
కుతుకానుధావితక్రోష్టురాజ!
అహహా! శ్రీవీరభద్రావతారమహేశ
నిహతదక్షకబంధనిహితవక్షన!
భళిరె! మేషరాజ బాపుహురభ్రేశ!
ఔర! మేడకేంద్ర యరరె తగర!
మమ్మ్రు హుంక్రియాభిమానక రిద్రాణ
మేలుమేలు గొఱ్ఱెమిండగీఁడ.

వ. మీఁకు నీగండంబులు దొలంగుంగాక యనుచు నట చని ముందటఁ గక్షువిలంబితతామ్రచూడు లగు నూడుపందెగాండ్రఁ గనుగొని యిదియును నొక్క సజీవద్యూతంబ యీదుఁగొదరక్రీడావిహారంబు నాదరింపవలయుఁ బానుగంటి కలుకోడి తోడఁ బుట్టువులువోని యీఁజగజెట్టి కోడిపుంజులయందుఁ బ్రత్యేకంబు.

కోళ్లపోరితము

గీ. పారిజాతపుఁబూవు నాఁ బరగు జూడు
తామ్రచూడంబు చూడాపథంబుజొత్తు

దర్పభరమున బ్రహ్మరంధ్రంబు నడుమఁ
జించివెడలిన క్రోధాగ్ని శిఖయుఁ బోలె.

వ. టిట్టిభ! యవలోకింపు నారికేళబకజాతీయంబులై
యాజగజెట్టి గోడిపుంజులు మెడలునిక్కించుచు
తెక్కలల్లార్చుచుఁ "గొక్కొక్కొ" యని కాల్ద్రి
వ్వి క్రొవ్వున నిగిడి తరళతారకోద్వృత్తరక్తాంత
లోచనమండలంబులై యొండొంటిం గదిసి
చుఱచుఱఁ జూచి యేచిన కోపాటోపంబున
గుప్పించి యుప్పర మెగసి చరణాంగుళీకుటిల
నఖశిఖాకోటికుట్టనంబులం జికుదొంగడు లెగయం వ
క్షస్స్థలంబులు వ్రచ్చి వంగరలాడియుం ద్రోసియు
లాసియు నాసాపుటంబులం బుటబుటన నడునెత్తిం జొ
త్తిలు నెత్తురు విఱ్ఱఁగఁ గఱచియుఁ బఱచియుఁ గొఱ
కొఱం గొఱుకుముఖంబున గుఱుకుగుఱుకు మనుచు
సవ్యాపసవ్యంబుల నోహరిం బక్షవిక్షేపంబులం
బడలువడ నడిచియు నొడిచియు నడికినడికిఁ దప్పిం
చుకొని సలిచప్పుడుగాకయుండం గాళ్లక్రిందికిఁ
దూఱియు జీరియు మాటిమాటికి "ఘాటఘాట
ఘాట" యని కృకాఘాటంబుక్కుఁ దండసంబులు
వోనిముక్కులం జెక్కులం జిక్కఁగా నొక్కి యిట్ట

ట్టనక బిట్టూనిపట్టి గాలంపుఁగొంకులభంగి వంక లగుకొంకికత్తులం గడుపులొడిచికొని చించి చెండాడి కొండొకసేపు వాలిసుగ్రీవుల విధంబున, వింధానువిందుల చందంబున, మురారిచాణూరుల ప్రకారంబున, నేకాంగయుద్ధంబుసేసి చారణగంధర్వ గరుడ విద్యాధర శ్లాఘనీయంబుగా నమోఘపరాక్రమంబు సలిపి వీరవ్రతంబేపాఱ వాహ్యాళీమండలంబుపం దమకుఁదార పాయగిలం బడి పోటుగండ్ల రొప్పు రుధిరంబులం దొప్పఁదోఁగి మూర్ఛాంధకారంబున మునుంగుచున్నయవి.

సీ. హా! కుమారస్వామియాపవాహ్యములార
హా! మంత్రదేవతాస్వామ్యములార
హా! కాలవిజ్ఞానపాకకోవిదులార
హా! భూతభుక్తికుంభార్హులార
హా! యహల్యాజారయభనహేతువులార
హా! బలాత్కారకామాంధులార
హా! నిరంకుశమహాహంకారనిధులార
హా! కామవిజయకాహళములార
హా! ఖగేంద్రంబులార కయ్యమున నీల్గి
పోవుచున్నారె దేవతాభువనమునకు

మీఱు రంభాతిలోత్తమా మేనకాది
భోగకార్యార్థమై కోడిపుంజులార.

వ. అని యటపోవుచు నాదక్షిణంబున పైఁడికుం
డల మొగసాలతోడిది మాధవశర్మకూఁతురు
మధుమావతిదేవి మందిరంబు.

మధుమావతియిల్లు

గీ. సింహళద్వీపమునఁ గాని సృష్టిలోనఁ
బద్మినీజాతి లేదనుపలుకు కల్ల
తెలిన మధుమావతీదేవి దేవకన్య
పద్మినీజాతి దోర్గంటిపట్టణమున.

చ. మలయజగంధి యైనమధు
మావతి యూర్పులకమ్మఁదావి చెం
గలువల సౌరభంబునకుఁ
గాదిలిచుట్టము చక్రవాకులం
కలకల నవ్వు దానిచను
కట్టు విశాలతదీయనేత్రముల్
తొలకరిక్రొమ్మెఱుంగు సయి
దోడులు మిండలు గండుమీలకుఁ.

ఉ. టిట్టిభసెట్టిగారు వినుఁ
డీ యొకచొక్కపుజోగి రేయి రో

వ ట్టిడి దీనితోఁ గలసి

భైరవతంత్రముఁ దీర్చి మెచ్చి సా

ధాట్టమునన్ లిఖించె నఖ

రాక్షరభంగిఁ దెనుంగుఁబద్యమున్

బుట్టువుపే రనాగతము

భోగము భాగ్యముఁ బ్రస్ఫుటంబుగన్.

క. ఈతలిరుంబోడికిఁ గల

భూతభవద్భావికాలముల జన్మములన్

జాతులు ప్రస్ఫుటములుగా

నాతఁడు లిఖియించెఁ బద్య మల్లదె కంటే!

సీ. అలకాపురంబున నంగారవర్ముఁడన్

గంధర్వపతికన్య కమలపాణి

యాదివ్యగంధర్వి కపరావతారంబు

మధుమావ తోర్గంటిమండలమున

నాసుందరాంగి దాక్షారామమునఁ బుట్టు

భువనమోహిని చిన్నిపోతియనఁగ

నట్టిసత్ స్త్రీజాతి యాసానికూఁతురు

చిరకాలమున సదాశివునిఁ గూడి

పావనం బైన తమిలేటిపరిసరమున

వేఁగికురువాటికాదేశవిపినభూమిఁ

గోవు లను పెరిచెంచులకులమునందుఁ
గడిమిగత్తులయమ్మి నాఁ గలుగఁగలదు.

గీ. కడిమికత్తులమ్మి నిడువాలుఁగన్నులు
గండుమీల నడఁచు మిండగీఁడ!
దానిచన్నుదోయి ధారాసురత్రాణ
కటకకుంభికుంభకలహకారి.

మదాలస

వ. ఈ మఘమావతీదేవి చెలియలు మదాలస మన మీసాలప్పయద్వివేదులకొడుకు శ్రీధరునకు ననుపులంజెయై యుండు; నాకంజాక్షిం జగిలియారంజకుం డచ్చోటనే యున్నవాఁడని విన్నార మరయుదము గాక యనుచు మోసాలం జొచ్చి కక్ష్యాంతరమ్ములు గడచి గాజు టోవరిముందట గటకంబళంబులమీఁదఁ దమలోఁ జిటపొటవోవుచుం గూడియుంగూడకయున్న యప్ప చెలియండ్రను మామయాత్మజునిం జూచి గోవిందుండు మందస్మితంబున,

గీ. ఆహా వెట్టితి జొన్నగడ్డాగ్రహార
వృత్తి యేనూఱుమూకలవృత్తమునకు

ననుభవింపుఁడు నీవు మదాలసయును
నరసనంసార మింతయు నధ్రువంబు.

గీ. మిన్న కున్నార లిదియేమి మీరు ముగురు
నీఁగకును బోకవెట్టినయట్టిభంగి
హెచ్చుగుం దింతమాత్ర మేదేని గలదె
మానసంబు గోపము మాకు లేమియును దోఁచె.

వ. అనిన మధువావలి గోవిందమంచనశర్మతోఁ
నిట్లనియె.

సీ. నీకుఁ జెప్ప నేమి మా కీవు తోఁబుట్టఁగ
వైనమున్ జెప్పక యడఁపరాదు
నీమవిష్వ్యంకుండు నిర్భాగ్యుఁ డీతండ
యీపోయినట్టిరే యేకతమున
మామదాలస కేళిమందిరాంతరమున
హంసతూలికపాన్పు నందు నొంటి
నిద్రించి యుండంగ నీవిబంధం బూడ్చి
యటు చేయవలసినయట్టు చేసె
మధుమదారంభమున మేను మఱచి యపుడు
మోసపోయితి మీనాఁడు ముట్టఁ దెలియఁ
జెలియలికి నాకు గొడ్డేఱ కలఁకవుట్టె
బ్రాహ్మణుఁడౌ వీఁడు విశ్వాసపాతకుండు.

క. నడురేయి మధుమదంబున
నోడ లెఱుఁగక యున్న నన్ను నోవరిలోనన్
దడవెను గుడిలో నుండియు
గుడిశాల్లను దీసె వీఁడు గోళకుఁడరయన్.

వ. పాడిపంతంబు లెఱిఁగిన పెద్దవు నీవు మాభాగ్య కృతంబున విచ్చేసితివి యజ్ఞానకృతంబునకుం బ్రాయశ్చిత్తంబు విధింపు మని మఱియును,

శా. హాలాపానమదాతిరేకమునఁ బ
ర్యంకంబుపై నొంటి ని
ద్రాలస్యంబున నుంటదక్క, మఱి యే
యన్యాయమున్ జేయ నే
నేలా పాపము గట్టె! నీభయము వో
నే ముట్టెదన్ శుద్ధికై
వాలాయంబును మీనకేతనుని ది
వ్యశ్రీపదాంభోజముల్.

వ. అనిన గోవిందుండు మీరు విటజన ధర్మసూత్రం బెఱుంగ రిది యన్యాయంబు గాదు వేశ్యాజనంబునకు వావివరుస యెక్కడిది? తొల్లి నముచిసూదనునకు ననుపులంజెయై యూర్వశి యతని కొడుకుఁ గవ్వడిం గామింపదే! రావణుండు నల

కూంబరుని రంభోరు సంభోరుహాక్షి రంభం గోడ
లిని సంభోగింపక సాగ నిచ్చెనే! వారకాంతను
దల్లి, దాసి, యక్క, చెలియలు, కూఁతురు, దాది
యని కేళికాగేహంబునం బరిహరించుట విట
ధర్మంబుగాదు.

గీ. జాణతనము గల్గి సవరతనము గల్గి
తెలివి గల్గి మోరతీపుగల్గి
చేయలంతి తనకుఁ జేకూడినప్పుడు
వాని వలపు లంజెవారె యుంట.

వ. అనిపలికి సౌముఖ్యంబు సంపాదించి,

చ. వదినెయు, లంజెయుఁ, విటుఁడు,
వైరము లాత్మల నుజ్జగింపుఁ డ
భ్యుదయపరంపరావిభవ
భోగము లందుఁడు మేము వోయివ
చ్చెద మని వారిసత్కృతులు
చేకొని మంచనశర్మ వెళ్లెఁ ద
త్సదన మపారభాగ్యధన
సంపద కెంతయుఁ జోద్యమందుచున్.

చ. కొడుకులు కూఁతులుం గలిగి,
కూడునుఁ బాడియుఁ ద్రవ్యతండమై

విడిముడి లాఁతుగాఁ గలిగి,

వెండియుఁ బైఁడీయు నిండ్లలోపలఁ

దడఁబడఁ దారు బంధువులుఁ

దామరతంపరలై, సుఖించువా

రుడుపతిమౌళిమౌళి నొక

యుమ్మెతపూ విడువాసవేడుకన్.

సూర్యాస్తమయము

వ. అనుచు మధుమావతీదేవి భవనంబు వెలువడి కట్టాయితం బైన ఘుటశాసిపుంగవుండు నింగి చెఱంగు మొన ద్రాలిన పతంగబింబంబుంగను గొని టిట్టిభ! యదె చూడు, వరుణరాజ వారాంగ నావిలాసదర్పణానుకారియై యహర్పతి గ్రుంకం బోయె నింక మనకు సేవంకం దడయఁబని లేదు కుహాళీచషకంబుల నారికేళంపు మధువుం గ్రోలి మత్తిల్లి వీరె మందిరోద్యానవీథులం బల్లవాధ రలు పుష్పగంధికానృత్యంబులు పరిభవించెదరు; వారు కొందఱు మందిర ప్రాంగణంబున వారాం గనాజనంబులు విచిత్రశ్లోకంబు లనేక రాగంబు లంగూర్చి లాస్యాంగం బుత్తమంబుగాఁ జూపె దరు; మఱియు నంత రాంతరంబులం బ్రచ్ఛేదన

సైంధవ ద్విమూఢకస్థిత పార్శ్వాదిమార్గాభినయ భేదంబులు రసభావభావనామోదమధురంబుగా శాతోదరు లభినయించెదరు. ఇవ్విధంబున వినోదంబు లిన్నియుం జూడం దలంచితిమేని కామమం డప గృహప్రవేశంబునకుం గార్తాంతికుండు వెట్టిన మూహూర్తంబు సరిగడచు నిపుడు పుష్యనక్షత్రంబున నాల్గవపాదంబు నడచుచున్నయది కాలావర్త విషనాడి కాస్పర్శనంబు లేక యమృతద్వంద్వంబుగూడి యుండుబింబాననాధరోష్ఠపల్లవామృత పారణలాభంబునకుం గారణంబు గాం గలిగి యున్నయది యివ్వేశవాటంబు వీథీవిటంకం బతిక్రమించి వేవేగం జనవలయు నిదె యాంటది యొకసురపొన్నక్రీనీడ క్రీడాభరంబున గన్నియ లంగూడి కందుకక్రీడ యొనర్చుచున్నయది దీనిన లవోక వోలె నైనం జూడవలయునని చూడం జని,

బంతులాట

శా. పంచారించిన లేంతచన్నులపయిం
బ్రాలంబముల్ గ్రాలంగాం
గాంచీనూపురకంకణక్వణనముల్
గర్జింప బాలాజనుల్

కించిన్న్యంచపదం బితడమనుగాఁ
గ్రీడించెన ర్భ్యాడుమా!
చంచత్కాంచనకంమకత్రయములన్
సవ్యాపసవ్యంబులన్

నట్టువునికోడలు

వ. అనుచుం గతిపయపదంబు లహుగఁ గట్టెమర నొకచెట్ట (నట్టు?) వునికోడలు గోడలు నక్కిచూడఁ బోడగని యమ్మచ్చెకంటి మున్న దన్నుకింగినది యగుట టిట్టిభున కెఱింగించి గోవిందమంచనశర్మ యిట్లనియె.

క. వ్రాలె నరవిందలోచన
పాలిండులు చూడఁజూడఁ బ్రసవాంత్యమునన్.
ఏలా యీమాటలపని?
వ్రాలుట చోద్యంబె చక్రవాకులకోదమల్?

వ. అనుచుం జనునప్పుడు ముందట నొక సైరికునిం గని టిట్టిభునకుం జూపి యిట్లనియె.

సైరికుఁడు (హాలికుఁడు)

గీ. మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చడం బమ్ముకొన్నాఁడు పణములకు
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి నొఱగోయ కేలుండు సైరికుఁడు.

ఉ. దిక్కరికుంభకుంటముల
దీకొను చన్నులు; కాముతేరిపై
టక్కుపుగండుమీల నను
డాల్కనుకన్నులు, క్రొమ్మెఱుంగుతో
నుక్కివమాడు మేనిపస,
యొడ్లకుఁగల్గునె యోరుఁగంటియం
దక్కలవాడలోని వెల
యాండ్రకుఁదక్కఁ గిరాటటిట్టిభా!

వ. అనుచు నటచని వేశవాటంబు వెడలి భైరవాల యద్వారంబునఁ బాడిపంతంబునం గూడిన పౌర విటలోకంబుం గనుంగొని యేమి ధర్మాసనంబుఁ దీర్చెదరొకో యని యడిగిన,

జారధర్మాసనము

సీ. మును తనకూఁతు దీముగఁ జూపి రోవట్టు
పరదేశివిటునిచేఁ బణము గినిసి,
ననుపుపల్లవుని సన్నసన్న రప్పించి
యతనిశయ్యకు దాని ననిపిపుచ్చి,
కైసేసి తనయింటిదాసి నావిప్రున
కాతిథ్య మొనరింప ననుమతించె,

దాని నాద్విజుఁడు ప్రాతఃకాలమునఁజూచి
అవట బెడదవెట్టిన యప్పు బెదరదయ్యె
పిల్ల కోపంబుతో నిల్లు వెళ్లివచ్చి
తలనగుల కీప్రసంగ మంతయును జెప్ప
వారు రప్పింపవచ్చె నీవదరుజఱభి
లంజెతల్లియె యిదియు గుల్లాముగాక.

వ. అనిన నజ్జఱభిభయంబు నొంది సభాసదులకు దండప్రణామంబు సేసి యాత్రావిళు నుద్దేశించి,

శా. నీకుం జేసినబాస రొట్టెదిరొయి తుం
డీరద్విజశ్రేష్ఠ! మా
రాకాచంద్రనిభాస్య కాకతిమహా
రాజేనిఁ బుత్తెంచినం
గైకో; దెట్టులు నేమిసేయుదును; శృం
గారంపు లేఁదోఁటలోఁ
బైకొం గెత్తి, కుచంబు లొత్తి, పరిరం
భం బీను లేఁగోర్వికిఁ.

వ. మన్ముత్తు నూరక రట్టుసేయుట ధర్మంబు గా దను చున్నయాధూర్తజఱభిం జూచి యవ్విటలోకంబు

"ప్రోడ నొక్కనినిమిత్తంబున భంగపెట్టు ట
యుక్తం" బని "నీవు విటధర్మంబెఱిగినవాఁడ
వానతీయవలయు" ననిన గోవిందుండు,

క. కందర్పశాస్త్రవేదులు
నిందుకు పాణ్మాసచింత యేలా నెఱపన్
సందేహింపక గొఱిగిం
పందగు నీజఱభిజుట్టువట్టి రయమునన్.

గీ. ముక్కుసోణంబుదాఁకను జెక్కు టొకటి
బోసినోరుగఁ బండ్లూడఁ బొడుచు టొకటి
గూబ లంటఁగఁ జెవిదోయి గోయు టొకటి
లంజెతల్లి యొనర్చుకల్లలకు శిక్ష.

వ. మాకుం దోఁచిన ధర్మంబుఁ జెప్పితిమి. యథా
పరాధంబుగా నీయధమజాతిని దండింపుఁడు
మఱియు నొక్క విన్నపంబు.

మ. స్మరదివ్యాగమకోవిదుల్, మదనశి
క్షాతంత్రవిద్యావిదుల్,
సురతారంభమహాధ్వర ప్రవణు, లి
చ్ఛోప్సుండు వేశ్యానరుల్
తిరమై నాకు ననుజ్ఞ యిం డిపుడు (తా
క్రీయూకమైయొప్పున?)

ప్పురుషార్థంబు నెఱుంగఁబోయెడఁబున
ర్యాభామినీవాటికిఁ.

(ఇక్కడను గొంత గ్రంథపాతమయియుండును)

నిశాముఖము

వ. అనంతరంబ భాస్వంతుండు వరుణరాజ శుద్ధాంతకాంతాసివాస మాణిక్యదర్పణంబై చరమగిరికటకకాననంబు మాటునం జాటువడియెఁ, గాశ్మీర పరాగ చ్ఛటాభాసురం బైన సంధ్యారాగంబు నింగియుంగిలికంబునం బెట్టి క్రీడోద్ధూతధూర్జటిజటాజూటవల్లీమతల్లి కామల్లి కాకోరకాకారంబులై తారకంబులు వియత్తలంబునఁ దళతళ వెలింగె, విభావరీపురంధ్రీకర్ణపూర చాంపేయకుసుమసాదృశ్యసౌభాగ్య సంపత్సంపాదనలంపటంబులై భువనప్రదేశంబులు ప్రకాశించె, నెఱసంజయుమసమసకని చీకట్లునుం గలసి దిక్సౌధకూటవాటీనికురుంబంబుల వేలవిడిచిన కురువిందపూసలపేరునుంబోలె పొలుపుమిగిలె నప్పుడు గోవిందశర్మ గోధూళిలగ్నంబున నార్యవాటికఁ బ్రవేశించి కామమంజరీ చౌర్యరతి విహారసంకేతస్థలంబు లైన రథ్యాముఖ శివచత్వరప్రపామంట

పంబులు విలోకింపుచుఁ, గులటాజాలతిలకంబు
లకుం గుంటెనకత్తియు నగు కొత్తైమజంగమబో
డితలకుం గ్రేఁగంటిమాపు సన్నఁ దనరాక యెఱిం
గింపుచు, నవ్వేళకుం జూడ గూఢవివిక్తంబునుం,
బూర్వపరిచితంబునుం, బహుజనశూన్యంబును, వి
వాహకాలోచితవృత్తస్తనభారవివిధవిలాస విప్ర
వాసకన్యాసనాథంబును, విశ్రాంతిస్థలంబును, నైన
యొక్క తిమ్మడిసానిమందిరంబున విడిసి, తనరాక
దేవమాత్రామిషంబున నప్పూజరివిధవచేత నెఱిం
గింపం బంచి, వీరభద్రేశ్వరస్థానంబు వెనుక బొడ్డ
నబావియందు గృతసంధ్యావందనుండై నిజాంత
ర్గతంబున,

ఉ. కంగటికాలు పుచ్చుకొని
ఖంగనఁ గాలుకిరీటకూటముల్
లొంగఁ గొనంగ లేరు, రవి
నోరుఁ దటాలనఁ దన్న లేరు, క
న్నింగల మూని దర్పకుని
నేర్పఁగ లేరు, లలాటపట్టకో
త్సంగము చేరునే యహహా!
తక్కటివేల్పులకై మసంజలుల్.

వ. అనుచు శివార్చనంబు దీర్చి సుఖాసీనుండై టిట్టిభునితో నిట్లనియె.

మ. వదనాంభోరుహ ఘ్రాత్కృ(?) మాపవన ని
ర్వాణప్రదీపంబు
... ... ... ... ...
... ... ... ...
... ... ... ... ...
... ... ... ...
... ... ... ... ...
... ... ... ...

చ. పొగలినచీకువాల నడు
ప్రొద్దున యౌవనగర్వవిక్రియా
మదమున వింజ మూ కిడిన
హాట్కృ(?) బురంబు జనంబు నిద్దురం.
గదిరిన వేళ నాయెడకుఁ
గామినిరానలవాటుసేతకై
. . . . . . .
నిమీలితాక్షియై.

ఉ. పట్టపునీలిచేల గడి
తాబుగఁ గచ్చ బిగించి, క్రిందుగాఁ

గట్టి కటారికోల కర
కంజమునం ధరియించి, గుబ్బచ
న్కట్టునఁ గోఁపుటాగి తొడి,
గ్రక్కున నన్నడు రేయి వచ్చి, నా
కట్టెదురం జొహారు లనుఁ
గాంత భటుండయి నవ్వటాలకున్.

వ. అపుడుం బెక్కు ప్రకారంబుల నాకాముకుండు పూర్వ వృత్తాంతంబు కట్టనుంగుఁ జెలికాఁడైన కిరాటటిట్టిభ సెట్టితో నుబ్బున నుగ్గడింపుచుఁ గామమంజరీ సందర్శనోత్కంఠాతిసంకులంబైన చిత్తంబు మన్మథాయత్తంబై యుండఁ, గొండంత యాశతో ధార్మికధర్మపతి యెప్పుడువచ్చునో యనియువ్విళ్లూరుచుం దృణంబు చలించినం, జీమచిటుకన్ననుం, జెవి వ్రాలంబెట్టియాలించుచు, భామినీవిలోకనోత్సవం బాసన్నం బగుటం జేసి

..........................................

దీపంబునుంబోలెఁ బరితాపంబు వహించుచుండ, నంతఁ జంద్రుండు పురందర హరిద్దరీకుహర గర్భాంతరాళంబుననుండి కంఠీరవంబునుం బోలె మింటికి లంఘించి మయూఖనఖరంబులం

దిమిరకుంభికుంభంబులు వ్రచ్చివందఱలాడి నభః
క్రోడంబున సుడుగణంబు లనుముత్తియంబుల
వెదఁజల్లె నావేళ నిండువెన్నెలగాయఁ బ్రాణ
నాయకుండు వచ్చుట గని విని పరమహర్షో
త్కర్షంబున,

గీ. వీరభద్రేశ్వరార్చనావిధి నెపమున

. . . . . . .

. . . . . . .

. . . . . . .

కామమంజరి

మ. కరపద్మంబునఁ బైఁడిపళ్లెరమునం
గంధాక్షతల్ పచ్చక
ప్పురము౯ వీడెముగొంచుఁ గ్రొత్తముసుఁగుం
బొన్పట్టునీరంగితో
మురిపెం బొప్పఁగవచ్చెఁ జౌర్యరతసం
భోగార్థమై కామమం
జరి గోవిందునియొద్దకు౯ శివనమ
స్కారచ్ఛలం బొప్పఁగ౯.

క. మోదంబున రాకాచం
ద్రోదయదేవతయుఁబోలె నొయ్యనఁ జని శా

తోదరి గోవిందుని శ్రీ
పాదంబుల కెఱఁగె భక్తిభయలజ్జలతోఁ.

ఉ. మచ్చికయుం బ్రమోదమును
మన్ననయుఁ నయమ్ముఁ విలాసమ్ముఁ
మెచ్చును నేర్పడం దనకు
మేయిడి మ్రొక్కినకామమంజరిఁ
గ్రుచ్చియుఁ గౌఁగిలించె సరి
గుబ్బచనుంగవ రెండుఁ గ్రేవలఁ
బచ్చనివింటిజోదు పయి
పైఁబులకంబులు నారువోయఁగఁ.

వ. అనంతరం బాసనాసీనుఁడైన నగ్గోవిందుండు
కామమంజరిం జూచి,

మ. అరవిందాస్య! తలంచిచూడ నిది య
త్యాశ్చర్యమో కాని నీ
సరసాలాపము లాదరించి వినఁగా
సంభావనం జూడమిఁ
ఖరపాకంబయి కర్ణరంధ్రముల కం
గారంబుగా బిట్టుని
ష్ఠురముల్ పల్కెడు రాజకీరములు గం
డుంగోయిల ల్వాణియుల్.

వ. అని జారదంపతులు పూజరివారియింటిముంగిట
వెన్నెలబైటనుండి టిట్టిభునకుం గట్టాఁడిముత్తి
యంబునుంబోని తమ్మళిసానిం గూర్పు నేర్పు
విచారించి సన్నపు తెలుంగునం బూజరిసానిం
బిలిచి కనకనిష్కంబుతోడఁగూడఁ గర్పూరంబు
వీడియం బచ్చడియచేతిలోనం బెట్టి యాపాద
మస్తకంబువీక్షించి శిరఃకంపంబు సేసి,

సీ. బంగారుతలుపులు పాయంగ ఘట్టించి
లావణ్యవిత్త మేలా వ్రయించె
లావణ్యవిత్తమేలావ్రయించునుగాక
యతిమాత్ర మేలా ప్రయాసపడియె
నతిమాత్ర మాయాస మనుభవించునుగాక
విటజనంబుల నేల వెడ్డుకొలిపె
విటజనంబుల కారవేరంబు సేయఁగా
నేల నిర్మింపఁడో యెనయుమగని
సొమ్ముపోక మహాప్రయాసమ్మురాక
ప్రజలబాధ నిరర్థ కారంభణంబు
తెలమి సిద్ధింపనేమిగాఁ దలఁచెనొక్కొ
సరసిజాసనుఁ డీతలోదరి సృజించి.

చ. దారసెమునందు చుట్టుకొని
తోరణకట్టె నురోవిభాగముర్
నిరుడు పయోజకోశరమ
ణీయతఁ దాల్చెను, వర్తమానవ
త్సరమున నొప్పె హేమకల
శంబులబాగున, ముందటేటికిం
గరినిభయానచన్నుఁగవ
కౌఁగిలిపట్టులు గాకయుండునే.

గీ. సన్నచూపులఁ బూజరిసానిఁ బిలిచి
పసిఁడిటంకంబు పరిరంభపణముసేసి
టిట్టిభునితోడ నేఁడు కూడింపు కూఁతు
నేకశయ్యా సహాయసుశ్రీకి మించ.

క. కన్నెతిక ముడుప వేతే
సొన్నాటంకములు రెండు చుట్టంబులలోఁ
గన్నుమొఱంగెడునేర్పును
విన్నాణము మాకుఁ గలదు వెఱ పేమిటికిర్.

వ. అని నుతింపంజెప్పి బొమలమీఁద వెండ్రుకలు
ద్రావాల పూజరిసానిబిడ్డను వెడ్డువెట్టి టిట్టిభుని చేతి
కిచ్చి యచ్చ వెన్నెలలం బొరపొచ్చెంబులేని

మచ్చికల చంద్ర మండలంబుమీద దృష్టినిలిపి
టిట్టిభుండు విన నిట్లనియె.

సీ. కలశపాథోరాశిగారాపునందన!
కల్యాణములు మాకుఁ గలుగఁజేయు
కుసుమకోదండునికూరిమిమామ! సౌ
ఖ్యాభ్యుదయంబు మా కాచరింపు
రాకావిభావరీరమణీమనోహర!
సంతోషములు మాకు సవదరింపు
శౌరిపట్టపుదేవికూరిమిసయిదోడ!
యైశ్వర్యములు మాకు నాచరింపు
మనుచు గొజ్జంగి నీరను నర్ఘ్యమిచ్చి
పచ్చికప్పుర మందంద బడిసివైచి
మ్రొక్కి రనురాగసంపద మూరిఁబోవ
జారజాయాపతులు నిందుఁ జందురునకు.

క. వటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు కవిది వినుకొండమహా
పుటభేదన మీత్రితయము
నిటగూర్చెను బ్రహ్మ రసికులెల్లను మెచ్చన్.

చ. ముదమున ముల్కినాటిపుర
మోహనశైలసువర్ణకందరా
సదనుఁడు కాలభైరవుఁడు
శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవ
ముల్ గృపసేయుఁ గవీంద్రకాంక్షిత
త్రిదశమహీరుహంబునకుఁ
దిప్పయవల్లభరాయమంత్రికిన్

వ. అని యందఱును యధాసుఖంబుగ నిజస్థానం
బుల కరిగి సుఖయించుచుండిరి.

## గద్య.

ఇది శ్రీమన్మహామంత్రిశేఖర వినుకొండతిప్ప
యామాత్యనందన చందమాంబాగర్భపుణ్యో
దయ సుకవిజనవిధేయ వల్లభరాయ ప్రణీ
తంబైన క్రీడాభిరామం బనువీధినాట
కంబున సర్వంబు నేకాశ్వాసము.

సంపూర్ణము.



Printed at Padma & Co., 17, Sunkurama Chetty Street, Madras